# మీనాక్షీ ప్రేమా! రహ్మత్ నగరమా!!



ఆగష్టు - 1981

ప్రతులకు :

సాహిత్య నికేతన్

3-4-705/1, [illegible]

హైదరాబాద్-500 029

ముద్రణ :

భారత ముద్రణాలయం

నారాయణగూడ,

హైదరాబాద్-500 029

వెల : 1-25

నవభారతి ప్రచురణలు

3-4-852 బరకత్‌పురా, హైదరాబాద్-500 027

# ఈ పుస్తకంలో

ఇటీవల ప్రముఖంగా వార్తల్లో కన్పిస్తున్న ఒక కుగ్రామం—మీనాక్షి పురం ఎన్నో శతాబ్దాలుగా మనదేశంలో హిందువులను ఇతర మతాలలోకి మార్చటం జరుగుతూనే ఉంది. ఒకరుగా, ఇద్దరుగా లేదా ఒకటి రెండు కుటుంబాల వారుగా మతం మార్చు కొనటం మామూలుగా జరుగుతూనే ఉంది. జాతిసమగ్రతకు ఇవి ఎట్లా హానికరమో పట్టించుకున్నవారు తక్కువ. మీనాక్షిపురంలో అట్లా గాదు. మూకుమ్మడిగా యాభై అరవై హిందూ కుటుంబాలు ఒక్కసారిగా యిస్లాం మతం స్వీకరించటం... అందుకోసం ఒక రోజున పెద్ద ఉత్సవం జరగటం... అటు తర్వాత చుట్టు ప్రక్కల అనేకతమిళనాడు గ్రామాలలో మూకుమ్మడిమార్పిడీలు జరుపబడటం:.. మీనాక్షిపురం పేరే రహ్మత్‌నగర్‌గా మార్చా లని ప్రయత్నించటం... వీటితో యావత్తు దేశంలో పెద్ద సంచ లనం సృష్టించబడింది.

ఈ మూకుమ్మడి మతం మార్పిడులు ఎవరు, ఎందుకోసం చేయిస్తు న్నారు? స్వచ్ఛందంగానే హరిజనులు-యిస్లాంమతం హిందూమతం కంటె గొప్పదని నమ్మి-మతం మార్చుకుంటున్నారా ? లేక ప్రలో భాలకు లోనై ... బలహీన క్షణంలో... ఈ మార్పిడీలు ఎవరన్నా జరిపిస్తున్నారా? వీటిని గురించి చర్చించే చిన్న పుస్తకం యిది. అట్లాగే.... ఈ సంఘటనతో చకితమైన హిందూ సమాజం, దాని నుండి తేరుకొని, స్వధర్మరక్షణార్థమై చేస్తున్న కృషి ఏమిటో ఇందులో సంక్షిప్తంగా చెప్పబడింది. చేయవలసినదేమిటో కూడ సూచనామాత్రంగా ఉటంకించబడింది.

—నవభారతి



# హెచ్చరిక ! హెచ్చరిక !!

తమిళనాడులో ఒక మారుమూల కుగ్రామం - మీనాక్షిపురం. నిద్రలో పడిఉన్నట్లు కన్పించే ఈ గ్రామం ఒక రోజున ఒళ్ళు విరుచుకొని లేచి, వార్తల్లోకి వచ్చేసింది !

ఆరోజు - ఫిబ్రవరి 19, 1981.

ఆరోజున మీనాక్షిపురంలో ఒక దుర్ఘటన జరిగిపోయింది.

మీనాక్షిపురం నివాసస్థులంతా కలిసి వెయ్యికిలోపే. అంతా 200 కుటుంబాలు. వీరిలో ఎక్కువ మంది హరిజనులు; మిగిలిన వారందరూ (దాదాపుగా) తేవారులు. ఇక్కడి హరిజనులు వ్యవసాయపు పనులు చేసుకుంటూ జీవిస్తుంటారు. మీనాక్షిపురంలోనే గాక చుట్టు ప్రక్కల గ్రామాలలో కూడ వీరిట్లా పనిపాటలు చేసుకుంటుంటారు. తేవర్లూ పేదలే. కొందరు కూలీనాలీ చేసుకుంటే, కొద్దిమంది రేదో కాస్తంత భూమి పుట్రా ఉంది. భారత దేశంలోని వేలాది కుగ్రామాలలో ఒకటి మీనాక్షిపురం !

అటువంటి గ్రామం ఒక్కసారిగా వార్తలలోకి వచ్చేసింది. అనేక మంది మత, ధార్మిక సామాజిక సంస్థల ప్రముఖులు, రాజకీయనాయకులకది పర్యటన స్థలమైంది. ఫిబ్రవరి 19న ఆ గ్రామంలో జరిగిన దుర్ఘటన హిందూ సమాజానికి పెద్ద దెబ్బ పెట్టు.

ఫిబ్రవరి 19, 1981 నాడు మీనాక్షిపురంలో...143 హరిజన కుటుంబాలకు చెందిన 558 హిందువులు మూకుమ్మడిగా యిస్లాం మతం స్వీకరించారు. ఆటు తర్వాత మే నెలలో అవే కుటుంబాలకు చెందిన 300 మంది మైనరు బాలబాలికలకు కుచ్చుల టోపీలు పెట్టి, లుంగీలుకట్టి, సునతీలు చేయించి ఇస్లాం అనుయాయులుగా ముద్రలు వేశారు. సునతీలు చేయబడిన బాలురు శారీరకమైన బాధతో మాత్రమే గిలగిలలాడి పోయారు. వారి తల్లులకు-ఇస్లాం స్వీకరింపజేయబడిన హరిజనకుటుంబాల మహిళలకు - ఇంకా అంతకంటె ఎక్కువ బాధే కలిగించబడింది. ఇళ్ళల్లో దాక్కున్న ఈ స్త్రీలను ముస్లిం బీబీలు, దాదాలు కలిసి బయటకు తెచ్చి, అంతకు పూర్వం వారికి జరిగిన వివాహాలను రద్దుచేసి, వారందరికీ-ముస్లిం పద్ధతిలో, పునర్వివాహాలు జరిపించారు—'పాత' భర్తలతోనే అనుకోండి. అందుకు వారంగీకరించినట్లు "సంతకాలు" తీసుకున్నారు.

## స్వ చ్ఛం దం గా నా ?

ఇదంతా "స్వచ్ఛందంగా" జరిగిందని లోకం నమ్మాలని-దీనినంతా జరిపించిన వారు-అభిలషిస్తున్నారు, ఈ గడ్డమీద ఎన్నిపనులైనా "స్వచ్ఛందంగా" జరుగవచ్చు. ప్రతి పనికి ఒక ఖరీదు; ప్రతి మనిషికి ఒక మూల్యం ఉంటే ఉండవచ్చు. అట్టి వారు "స్వచ్ఛందంగా" ఎటువంటి ఘోరాలనైనా చేయవచ్చు.

కాని ... ...

ఈ గడ్డన పుట్టి, పెరిగిన మహిళలు మంగళసూత్రం తీసేసి, బొట్టు చెరిపేసుకొని, (పాత భర్తలతోనే అయినా) మళ్ళీ పెళ్ళికి "స్వచ్ఛందంగా" తయారైనారంటే మనం నమ్మగలమా ?

మనం కాదు-ప్రపంచంలో ఎవరైనా సరే, హిందూ మహిళలు ఎటువంటి అనుచితానికి అంగీకరించారని అంటే, నమ్మగలరా?

నమ్మమంటారు— మక్వానాలు, మౌల్వీలు, ముస్లిం దేశాలు విసిరే స్తున్న పెట్రో-డాలర్లకు కక్కుర్తిపడుతున్న జీవాలు!

మీనాక్షిపురంలో.. మరోచోట,మరోచోట హరిజనులను అగ్రవర్ణాల వారు హీనంగా చూస్తున్నారుట. నీచంగా పరిగణిస్తున్నారుట. హింసల పాలు చేస్తున్నారుట. పోలీసులు కూడ హరిజనులనే హింసిస్తున్నారుట. (ఇది వాస్తవమైతే, ఆ పోలీసుల మంత్రి అయిన మక్వానాగారే దీనికి బాధ్యత వహించాలి గదా!) హరిజనులకని ప్రభుత్వం కేటాయించిన సౌకర్యాలు వారికి చేరటంలేదట! ఈ దారుణమంతా దుస్సహమై (నేటికి!) హరిజన కుటుంబాల వారు "స్వచ్ఛందంగా" యిస్లాం మతం స్వీకరిస్తున్నారుట!

జరిగిన దుర్ఘటనను యిట్లా ఎన్నో విధాలుగా సమర్థించటానికి దారుణమైన ప్రచారం జరుగుతున్నది.

## మెరుగైనదా - ముస్లిం సమాజం ?

హరిజనులుగా హిందూ సమాజంలో వారికి లభించని, రక్షణ ముస్లిములుగా లభిస్తుందట!

మీనాక్షిపురం ప్రాంతంలో నడుస్తున్న ఒక దొంగనోట్ల కేసు, ఒక హత్యకేసులో ముద్దాయిలైన వారిలో ముస్లింలతో, మర్యాదగాను, హరిజను లతో దౌష్ట్యంతోనూ పోలీసులు ప్రవర్తించారుట. కాబట్టి ముస్లింలైతే 'రక్షణ' లభించినట్లే గదా? ఇదీ ఇక్కడి వారు చెప్తున్న 'రక్షణ'! దీనిని రక్షణ అనవచ్చునా? రేపక్కడి పోలీసులు హిందువులను రక్షించాయిస్తే తిరిగివీరు 'రక్షణ' యిక్కడే ఉందని తిరిగిరావటాన్ని ముల్లాలు, మౌల్వీలు హర్షిస్తారా ? హిందూ సమాజంలో లేని 'సమానత్వం', ముస్లిం సమా జంలో ఉన్నదని గమనించి, హరిజనులు యిస్లాం స్వీకరిస్తున్నారట.

ఇది నిజమా ? ముస్లింలలో సమానత్వమున్నదా ? వారిలో కుల విభేదాలు లేవా? అంటరానితనం వంటి లోటుపాట్లు లేవా ? లేకేం - దండి గానే ఉన్నాయి. ముస్లింగా మారిన హరిజన స్త్రీ చెరువుకు నీళ్ళకొస్తే, అక్కడున్న (పాత) ముస్లిం స్త్రీలు చెరువు ఆమెకే వదిలి వెళ్ళిపోయారు. ఇది కట్టు కథ గాదు. జరిగిన విషయం. ఇది అంటరానితనం పాటించటం కాదా ? ముస్లింలలో ఎన్నికులాలున్నయ్యో, ఒక్కసారి ఈ పుస్తకం చివర యిచ్చిన అనుబంధం చూస్తే తెలుస్తుంది. అంతెందుకు-ఒక్కసూటి ప్రశ్న వేసుకుందాం. హిందూ సమాజం కంటె ముస్లిం సమాజం మెరుగ్గా ఉన్నదా ? నాగరికమైనదా ? సంస్కృతీ, సభ్యత, సాంప్రదాయాల సౌందర్యం అధికంగా కలట్టిదా! ఈ ప్రశ్నకు సమాధానం ఎవరికి వారే చెప్పుకోవచ్చు. చెప్పుకుంటే ఈ మతం మార్పిడులు "స్వచ్ఛందంగా" జరుగుతున్నది, పెట్రోడాలర్లతో జరుపబడుతున్నది ఎవరికి వారికే అర్థ మవుతుంది.

హిందూ సమాజంలో లోటుపాట్లు లేవని కాదు. అస్పృశ్యత ఈ సమాజంపై ఒక చెరగని మచ్చ. ఇక దౌష్ట్యాలు, దౌర్జన్యాలు 'హరి జనులు' కాబట్టి, జరగవు. అన్నికులాలవారు ఒకరితో ఇంకొకరు కల హించు కొనటం, కొట్లాటలకు దిగటం.... అక్కడక్కడ జరుగుతున్న దుర్మార్గాలే. ఇందుకు భూసంస్కరణలు, రిజర్వేషన్ల వంటి సామాజిక పురోభివృద్ధి కార్యక్రమాలలో పాలకపక్షం, తదితర రాజకీయ పార్టీలు నడుపుతున్న నాటకాలు కొంతవరకు కారణ మవుతున్నాయి. లంచగొండి తనం మరో పిశాచం. ఇవన్నీ మనం సవరించుకోవలసిందే.

## సంయమనకృషి

సవరించుకోడానికి మనమెంతో కృషి చేస్తున్నాంకూడ. హరిజన గిరిజనాది బడుగు సోదరులను అందరితో సమానంగా తీసుకొని రావటా నికై తక్కువ కృషి జరుగుతున్నదా-మన సమాజంలో? వీరివిషయంలో

కొందరేదో జరుపుతున్నారనే దౌష్ట్యం సంగతే ప్రస్తావనకు వస్తున్నది గాని...వీరికి అందరితో సమానమైనస్థాయిని కలిగించడానికై సామాజిక సోదరులు ఎంతటి త్యాగభావాన్ని, బంధుభావనను ప్రదర్శిస్తున్నారో అది గమనించనక్కరలేదా? అటు ప్రభుత్వం, ఇటు సామాజిక, ధార్మిక సంస్థలు హైందవ సమాజంలో కాలగమనంలో ఉద్భవించిన లోపాలోపాలను తొలగించుకోటానికై ఎంతటి కృషి చేస్తున్నదీ అర్థం చేసుకోనక్కరలేదా ? ఇంత కాలంగా మన బడుగు బాంధవులను అణగార్చి ఉంచామనే దోషభావనతో, తరతరాలుగా జరిగిన తప్పులను సవరించుకోవాలనే వివేకంతో నేటి తరాంవారు...రిజర్వేషన్లు మొదలైన వాటిని ఎంతగా సమర్థిస్తున్నారో-వాటిని మెచ్చుకోనక్కరలేదా? బిచ్చంగా కాక, బాధ్యతగా, ప్రేమగా హరిజనులను ఆదరిస్తున్న సమాజపు కృషి వృథా పోతుందా ?

ఇదంతా మన హరిజన సోదరులకు తెలియదా ? కొద్దిమంది జరిపారనే దుర్మార్గమే వారిని ఇస్లాంలోకి నెట్టివేస్తే, ఇంతమంది నెరపుతున్న ప్రేమ, బంధుభావం, సేవానిరతి పట్ల వారు కృతఘ్నులైనారని అర్థమా ?

కానే కాదు - హరిజన సోదరులకు పరిస్థితులు మెరుగవుతున్నవని తెలుసు. తాము పడ్డ అవస్థలు తమ పిల్లలు పడటంలేదని వారికి తెలుసు. అట్టివారు ఇప్పుడేదో వారి ఓర్మి హద్దులు దాటిపోయి... అమాంతం ఇస్లాం మతంలో వారికి వెలుగుబాట కన్పించి... "స్వచ్ఛందంగా" అందులోకి వెళ్ళిపోయారంటే నమ్మేవారు తెలివి హీనులైనా అయి ఉంటారు; తెలివి ఎక్కువైన రాజకీయాల వారన్నా అయి ఉంటారు.

ఖిలాఫత్ ఉద్యమం రోజుల్లోనే ఈ దేశంలోని హరిజనులందరిని ఇస్లాంలోకి మతం మార్పిడి చేయడానికై "కేటాయించమని" అడిగిన

ముస్లిం నాయకులున్నారు. హిందూ సమాజం ఈ హరిజనులను తమలో "పూర్తి సభ్యులుగా" స్వీకరించనందువల్ల, వారినలా సరిహద్దుపరను నెట్టి ఉంచటంవల్ల...ఆ హద్దు నుండి వారిని క్రైస్తవంలోకో, యిస్లాంలోకో లాక్కోవాలనే రాజకీయం ఈనాడు ప్రారంభం కాలేదు. నేడు ముస్లింలుగా, క్రైస్తవులుగా ఉన్న వారిలో 95 శాతం మతం మార్పిడి కుటుంబాల సంతానమే.

## అంతర్జాతీయ కుట్ర

నేటి మతం మార్పిడులు మనదేశంలోని మతాలు నడిపే రాజకీయంకూడ కాదు. అటు అరబ్బు దేశాలు, ఇటు చర్చి సామ్రాజ్యదేశాలు ఈ దేశంలో నడిపించే కుట్ర యిది. దానిని గుర్తించకుండా, గమనించకుండా, ఏవేవో కల్లబొల్లి కబుర్లతో ఇతరులనో లేక మనల్ని మనమో సమాధాన పరుచుకోజూడటం ఆత్మహత్యా సదృశమవుతుంది.

సంవత్సరానికో 10 లక్షల మంది హరిజనులను యిస్లాంలోకి మార్పిస్తే, ఈ శతాబ్దాంతానికి హిందూదేశంలో 20 కోట్ల మంది ముస్లింలుంటారని...అప్పుడీదేశం అరబ్బు దేశాల ఉపగ్రహం చేయవచ్చునని లండనులో జరిగిన ఇస్లాం కల్చరల్ సొసైటీ వారు ఆలోచించిన ప్రణాళిక! మీనాక్షిపురానికి, తదితర గ్రామాలకు తరలివస్తున్న డబ్బు ఎక్కడిది? ఆ ప్రశ్నకు సమాధానం ప్రభుత్వం ప్రకటిస్తే చాలు-ఈ ప్రమాదం నివారించబడుతుంది.

హిందూత్వం ఈ గడ్డన పుట్టిన వారికి నరనరాన జీర్ణించుకుపోయిన తత్వం. సమాజంలో ఉన్న లోపాలేమిటో ఈ సమాజంలోని వారికే తెలుసు. వాటిని వారు సవరించుకుంటారు. మరొకరింటిలో జొరబడి పెట్టుకుంటే, దీని నుండేదో మెరమెచ్చులు పొందాలని ప్రయత్నిస్తే, పరాధికారం పైన వేసుకున్న గార్దభాలే కాగలరు.

అట్లా అని ఎవ్వరూ అతి విశ్వాసంతో ఉండరాదు. ఇప్పుడు హిందూ సమాజం ఎదుర్కొంటున్నది-కొద్దిమంది పదవీ రాజకీయ వ్యామోహితులనో, దుందుడుకు శక్తులనో కాదు, అంతర్జాతీయంగా ఆలోచించబడిన ఒక కుట్రను.

ఆ కుట్రయొక్క స్వరూప స్వభావాలు తెలుసుకొని జాగ్రత్త పడటం, సదా జాగరితులమై ఉండటం—అదీ మనకు మీనాక్షిపురం చేస్తున్న హెచ్చరిక.



టోపీపెట్టి, ఖురాన్ చదివిస్తే-అంతే!
మతం పారిపోయినట్లే!

# 2 మహమ్మారి వ్యాప్తి

మీనాక్షిపురం ఒకకుగ్రామం. జనాభా కేవలం 945 మాత్రమే. ఈ గ్రామంలో అధికసంఖ్యాకులు హరిజనులే. ఇది తమిళనాడులోని తిరునల్వేలి జిల్లా-టెంకాశీ తాలూకాలో టెంకాశీకి 12. కి. మీ దూరంలో-ఉంది. ఈ గ్రామీణ ప్రాంతం, ఇంకా తిరునల్వేలి జిల్లాలోని ఇతర తాలూకాలు కేరళరాష్ట్రానికి సరిహద్దుల్లో ఉన్నాయి. గ్రామస్తులైన హరిజనులలో అధికశాతం వ్యవసాయకూలీలు. వీరు సమీపంలోని పాంఫోజి, మక్కెరై గ్రామాలలో రైతుల వ్యవసాయక్షేత్రాలలో పనిచేస్తారు. మొట్టమొదట 143 కుటుంబాలకు చెందిన 558 మంది 1981 ఫిబ్రవరిలో ఇస్లాం మతాన్ని స్వీకరించారు. ఆ తరువాత మే నెలాఖరుకు మొత్తం 765 మంది హరిజనులు ఇస్లాంలోకి మారిపోయారు. దీనికి కారణం పాంఫోజీ - మక్కెరై గ్రామాలలోని సవర్ణహిందువులనబడేవారు,[1] (తేవర్లు) హరిజనులను హింసించటమేనని, సాంఘిక అసమానతలేనని విపరీతమైన ప్రచారం ఆ ప్రాంతాలలో జరిగింది. కొద్ది నెలలుగా హరిజనులపై పోలీసుల దౌర్జన్యం మితిమీరిందని కూడ ఆరోపించబడింది.

---

1. అందరూ హిందువులేనని, "సవర్ణ హిందువులు" అనే పదం వాడవద్దని పూజ్య పెజావరు స్వామి పత్రికలకు, ప్రజలకు అందరికీ విజ్ఞప్తి చేశారు.

"మక్కెరై గ్రామానికి చెందిన ఇద్దరు (తేవర్ కులము) వ్యక్తుల హత్యను సాకుగా తీసుకొని పోలీసులు మమ్మల్ని హింసిస్తున్నారు. పేదరికంవలన కాక, మమ్మల్ని మేము కాపాడుకోవటం కొరకే ఇస్లాంలో చేరామని-" మీనాక్షీపురం పంచాయతీ సర్పంచ్ శ్రీ పరమ శివం [ప్రస్తుతం ఆయన పేరు-సయ్యద్ సులేమాన్] చెప్పారు. దీనిని బట్టి చూస్తే పై మతాంతరీకరణలు తమంతతాముగా ఇస్లాం మతం గొప్ప తనాన్ని అర్థంచేసికొని స్వచ్ఛందంగా జరిగినవి కావని - ఇతర సామాజిక పరిస్థితులు-ఒత్తిడుల వలన జరిగినవని స్పష్ట మౌతున్నది. దీనిసంతా స్వయంగా అధ్యయనం చేసిన వారు ఈ మతం మార్పిడులకు మూల కారణాలను యిట్లా పేర్కొంటున్నారు.

## వాస్తవస్థితి – మూలకారణాలు

మీనాక్షిపురం మరికొన్ని గ్రామాలు కేరళ సరిహద్దులో ఉన్నాయి. ఆ కారణం చేత తమిళనాడు-కేరళ రాష్ట్రాల (స్మగ్లింగ్‌కు) దొంగరవా ణాకు ఈ ప్రాంతం నిలయమైంది. ఇటీవల పోలీసులు ఈ ప్రాంతంలో పెద్దయెత్తున దొంగకరెన్సీని స్వాధీనం చేసికొని, కొందరిని అరెస్టు చేశారు. పోలీసుల కథనం ప్రకారం-అమెరికాకు చెందిన డగ్లస్ ఛారిటీ వారు స్థానిక క్రైస్తవ మిషనరీకి అత్యాధునికమైన ముద్రణాయంత్రాన్ని బహుమతిగా పంపారు. దానిద్వారా దొంగనోట్ల ముద్రణ యథేచ్ఛగా సాగుతున్నది. టెంకాశీలోని ఒక క్రైస్తవ కుటుంబం డగ్లస్ ఛారిటీవారి సహాయంతో ఒక అనాథ శరణాలయాన్ని నడుపుతున్నది. నిజానికిది ఒక ముసుగు మాత్రమే. వారి ప్రధానోద్దేశ్యం హరిజనులను (డబ్బు ద్వారా) క్రైస్తవులుగా మార్చటమె. అందుకొరకే ఆ క్రైస్తవ కుటుంబం ముద్రణాయంత్రాన్ని దొంగ కరెన్సీ ముద్రణకు ఉపయోగించారు.

ఈ క్రైస్తవ మిషనరీ కార్యకలాపాలే మిగతా హిందువులకు - హరిజనులకు మధ్య ద్వేషాలను సృష్టింపజేశాయి.

పోలీసు వర్గాలు తెలిపిన దాని ప్రకారం - ఈ దొంగనోట్ల ముద్రణ చాలా సంవత్సరాలుగా సాగుతున్నది. ముద్రణ చేస్తున్నది క్రైస్తవులు. ఆ దొంగనోట్లను మార్చేది ముస్లింలు. వారిరువురు, మధ్యలో హరిజను లను – సరుకు చేరవేసే వ్యక్తులుగా ఉపయోగించుకున్నారు. హిందూ తేవర్ల హత్యకేసులో పరిశోధిస్తున్న పోలీసులకు దొంగ కరెన్సీ వ్యవ హారం - హరిజనుల ప్రమేయం వగైరాలు వెలుగులోకి వచ్చాయి. దొంగ నోట్ల వ్యవహారంలో ముస్లింల పాత్ర ప్రధానమైనదని తెలిసినా రాజకీయ ఒత్తిడుల కారణంగా పోలీసులు వారిపై ఏ విధమైన చర్యా తీసికోలేదు. కాగా అమాయకులైన హరిజనలను అరెస్టు చేసి హింసించటం జరిగింది. ఇట్లా హింసించటం కోసం పోలీసులకు డబ్బు యిచ్చారని కూడ తెలుస్తు న్నది. నిజానికి ప్రధాన పాత్రధారులంతా ఇంకా తెరవెనకే ఉన్నారు.

ఇట్టి పరిస్థితులలో ముస్లింలు హరిజనుల కిచ్చిన అద్భుత సలహా —"మీరంతా ఇస్లాంలోకి మారండి. మీరు ముస్లింలైన తరు వాత పోలీసులు అరెస్టు చేయటానికి— హింసించటానికి సాహసించలేరు. మేము మీకు జీవనానికి —వృత్తులు చేసుకోవటానికి కావల్సిన ధన సహా యం చేస్తాం.'' ఈ విధమైన ఆర్థిక సహాయ వాగ్దానం, పోలీసుల నుండి రక్షణ మొదలైనవి హరిజన సోదరులను ఆ నిస్సహాయ స్థితిలో సహజంగానే ప్రలోభంలోనికి నెట్టాయి. ప్రభుత్వ వర్గాలు, పోలీసుల అవినీతి కూడ ఈ ప్రమాదానికి కారణమవుతున్నాయి!

## ఫిబ్రవరి 19, 1981

ఫిబ్రవరి 19, 1981 న ముస్లింలు బ్రహ్మాండమైన మతాంతరీ కరణ మహోత్సవం నిర్వహించారు. ఇస్లాంలో చేరే ప్రతి హరిజనునికి రు. 500/- లు నగదు, నూతన వస్త్రాలు బహూకరించారు. ఆనాటి ఉత్సవానికి మొత్తం 60 వేల రూపాయలు ఖర్చయినవని తమిళనాడు

షెడ్యూల్డు కులాలు జాతుల డైరక్టరు అంగీకరించారు! ఆ రోజున మరొక ఘోరమైన కార్యక్రమంకూడ జరిగింది. అనేక మంది హరిజన స్త్రీలను తమ తమ గుడిసెలలో నిర్బంధించారు. ఇస్లాం ఆచారం ప్రకారం వాళ్ళందరికీ బలవంతంగా మళ్ళీ వివాహాలు జరిపించారు. ఈ కార్యక్రమాన్ని సమీప గ్రామాలలోని ముస్లిం స్త్రీలు - స్థానికగూండాలు కలిసి నిర్వహించారు. బురఖాలు వేసుకొని ముస్లిం పురుషులే వచ్చారని చెప్పబడుతున్నది. హరిజన స్త్రీలను బలవంతంగా ఇండ్లలో నుండి ఈడ్చి పునర్వివాహాలు (తమ భర్తలతోటే) జరిపించారు. పురుషులకు సుంతీ చేయించారు. ఇట్లా బలప్రయోగం ద్వారా జరిగిన ఈ మతాంతరీకరణలు చట్ట విరుద్ధం కాదా?

ఆ తరువాత మే, 1981 లో 58 మంది మైనర్ బాల బాలికలను ఇస్లాంలోకి మార్చారు. నేటికి మొత్తం 300 మంది మైనరులను ఇస్లాంలోకి మార్చారు. 18 నెలల పిల్లవాడికి టోపీపెట్టి మతం మార్చారుట. రేపు 18 సంవత్సరాలు నిండిన తర్వాత ఆ కుర్రవాడు దానికి బాధపడ్డే! మైనరుల మతం మార్చటమంటే రాజ్యాంగం వారికి ప్రసాదించిన మత స్వేచ్ఛను హస్యం చేయటం కాదా? ఇది రాజ్యాంగ విరుద్ధమైన చర్యకాదా? ఈ మతాంతరీకరణోత్సవానికి బయటనుండి చాల మంది ముస్లింలు హాజరైనారు. బహుమతుల రూపేణా విస్తారంగా ధనాన్ని హరిజనులకు ముట్టజెప్పారు. స్త్రీలకు చీరలు - వివిధ వస్తువులు ఇవ్వబడ్డాయి.

## ఆర్థిక ప్రలోభాలు

ఇప్పటి వరకు ప్రతిరోజు ఆంధ్రప్రదేశ్, కర్ణాటక, కేరళ రాష్ట్రాలకు చెందినవారేగాక సుదూర ప్రాంతాలైన మహారాష్ట్ర, ఢిల్లీ, ఉత్తర ప్రదేశ్ ప్రాంతాలకు చెందిన ధనవంతులైన ముస్లింలు కార్లలో వచ్చి మీనాక్షిపురాన్ని సందర్శిస్తున్నారు. నూతనంగా మహమ్మదీయులైన

హరిజనులకు విలువైన బహుమతులను పంచిపెట్టటం జరుగుతున్నది ఒక ముస్లిం భాగ్యవంతుడు ఇక్కడ బావి త్రవ్వించటానికి 50 వేల రూపాయలు "చందా" యిచ్చారు. మతం మారినవారు తమ ఆదాయానికి మించిన స్థాయిలో జీవితం గడుపుతున్నారు. వారి స్త్రీలు అందమైన రంగు రంగుల చీరెలు ధరించి తిరుగుతుంటే, మతం మారని వారు పాత గుడ్డలలోనే కన్పిస్తున్నారు.

దీనిని బట్టి భారత్‌కు వ్యతిరేకంగా ఇస్లాం వర్గాలు ఒక పెద్ద కుట్రను జరుపుతున్నట్లు స్పష్టమవుతున్నది. బలప్రయోగం, ఒత్తిడులు, డబ్బు, రాజ్యాంగ విరుద్ధంగా ఇక్కడ ఉపయోగించబడుతున్నాయి.

## రహ్మత్‌నగర్ ?

ఈ సామూహిక మతాంతరీకరణల అనంతరం ఎన్నో వందల సంవత్సరాలుగాఉన్న "మీనాక్షిపురం" గ్రామం పేరును "రహ్మత్‌నగర్"గా మార్చాలని తీర్మానించారు. అయితే ఇస్లాంలో చేర నిరాకరించిన హరిజనుల, సమీపగ్రామాలలోని హిందువులు ఈ ప్రయత్నాన్ని తీవ్రంగా ప్రతిఘటించారు. ఈ కుటిలయత్నాలు చూచి దిగ్భ్రాంతులైన హిందువులు సమైక్యమై వారిని ఎదిరిస్తున్నారు. ఇదొకప్రక్క. మరొకప్రక్కన ముస్లింలు తమ కుట్రను విస్తృతపరుచుకుంటూ పోతూనేఉన్నారు. ఇంతటి కదలిక వచ్చినా చలించకుండా, వారు మతాంతరీకరణలు చేయిస్తూనే ఉన్నారు. ఇప్పటికి తమిళనాడులోని ఐదు జిల్లాలకు ఈ "మారి" వ్యాపించింది. మొత్తం తమిళనాడునే ఇది ఆక్రమించుకొంటుందేమో?

## 'అట్టియుట్టు'లో మతం మార్పిడి

తిరునల్వేలి జిల్లాలోని మరొక గ్రామం "అట్టియుట్టు". ఈ గ్రామ జనాభా 1650. వాటిలో 300 మంది ముస్లింలు. సమీపంగా ఉన్న

కీలకార్త్తై గ్రామానికి చెందిన ముస్లింల సహకారంతో అట్టియుట్టులో 192 మంది హరిజనులను ముస్లింలుగా మార్చటం జరిగింది. జూన్ 14, 1981న మతాంతరీకరణ కార్యక్రమం నిర్వహించారు. "ఇషాదుల్ ఇస్లాం'' సంస్థకు చెందిన షాహుల్ హమీదే మరైకార్ (పాలయంకోట్టై), జమాయత్-ఏ-ఇస్లామీ నాయకుడు మౌలానా మొయిద్దీన్‌లు ఈ కార్యక్రమాన్ని నడిపించారు. అంతేకాదు; పుదువాయల్ గ్రామానికి చెందిన కందన్ అనే వ్యక్తి, (ఆర్థిక లాభంతో ఇదివరకే ఇస్లాం స్వీకరించి ప్రస్తుతం అరబ్ దేశాలలో పనిచేస్తున్నారు.) దుబాయ్ నుండి ప్రత్యేకంగా ఈ ఉత్సవానికి హాజరైనారు. ఆయన తమ్ముడ్ని, కుటుంబాన్ని మతం మార్చటానికి ఈయన్ని ప్రత్యేకంగా రప్పించారుట. అట్టియుట్టులో మతం మారినవారు మారని తమ బంధువులను వెలివేసినట్లు చూస్తున్నారు. ముస్లిం భూస్వాములు వీరిని తమ పొలాల నుండి వెళ్ళగొడుతున్నారు. దీనిని బట్టి చూస్తే భారత్‌కు వెలుపలా-లోపలఉన్న ఇస్లాం మతాంతరీకరణల గూడుపుఠాణీ వెల్లడవుతున్నది.

## కురయూర్ సంఘటన

కురయూర్ గ్రామం మధురై జిల్లాలో ఉంది. మధురైకి 30 కి.మీ దూరంలో ఉన్న ఈ గ్రామంలో మొత్తం 1000 కుటుంబాలు ఉన్నాయి. అందులో 500 కుటుంబాలు హరిజనులవి. అంతే సంఖ్యలో మిగతా కులాలవారున్నారు. మొట్టమొదటగా ఈ గ్రామంలో[ఫిబ్రవరి-సెప్టెంబర్ 1980 మధ్య] 40 హరిజన కుటుంబాలు ఇస్లాంలోకి మార్చబడ్డాయి.

సెప్టెంబర్ 30, 1980 న ఒక పరిశీలకబృందం ఈ గ్రామంలోని వ్యక్తులను కలిసికొని వాస్తవాలు సేకరించింది.

కురయూర్‌లో మతాంతరీకరణలకు ప్రధానకారకుడుగా తెల్పబడిన వ్యక్తి డా. మనోహరన్. ఈయన రామనాథపురం జిల్లాతో జిల్లా వైద్య

శాఖాధికారి. ఈయన హరిజనులలో విద్యావంతుడు. వివాహితుడు, సంతానవంతుడు. ఈయన ఒక ముస్లింస్త్రీని ప్రేమించి ఆమెను పొందటానికై 1978 లో ఇస్లాంలోకి మారాడు. అతని చర్య కుటుంబంలో తీవ్రమైన విభేదాలను కల్గించింది. ఆయన తల్లి, భార్య ఈ ద్రోహాన్ని తీవ్రంగా ప్రతిఘటించారు. వారిరువురు ఇప్పటికీ హిందువులుగానే ఉన్నారు.

కేంద్ర హోంమంత్రి శ్రీ జైలుసింగ్ హైదరాబాదులో పత్రికలవారితో మాట్లాడుతూ ఒకటి కంటె ఎక్కువ వివాహాలు చేసుకోడానికై కొందరు ముస్లింలవుతున్నారని అంగీకరించారు. ఇస్లాం అంగీకరించే బహుభార్యాత్వం డా॥ మనోహరన్ పాలిట చక్కని వరమైంది. వ్యక్తిగత కాంక్షతో ముస్లింగా మారిన మనోహరన్ కురయూర్‌లోని కొందరు హరిజనులకు మార్గోపదేశడై వారినికూడా ముస్లింలుగా మార్చటం జరిగింది. ముస్లింలు డా॥ మనోహరన్‌ను ఇతర హరిజనులకు ఆదర్శంగా చూపి ప్రచారం చేస్తున్నారు. ఇట్టి ప్రలోభాలకు తోడు తీవ్రమైన వత్తిడులున్నాయి.

## తంజావూర్ జిల్లాలో...

ఈ జిల్లాలోని మతం మార్పిడులు ఇంకా వార్తలలోనికి ఎక్కలేదు. సనీ ఇస్లాం వారు ముందుగా హరిజనులలో ప్రముఖులైనవారిని మతం మార్పించి పూర్వరంగాన్ని సిద్ధం చేశారు. హాజీ ఎమ్. కరుణానిధి [నాగపట్టణం నుండి ఎన్నికైన డి. యం. కె.— ఎమ్. పి.] మామగారైన శ్రీ అంబికాపతి ఇస్లాం స్వీకరించారు. ఆయన తిరుత్తురై పొండి గ్రామంలో ఇప్పటికే 20 హరిజన కుటుంబాలను ముస్లింలుగా మార్చారు. జిల్లాలో ఇంకా పెద్దయెత్తున మతం మార్పిడికి హరిజనులను ప్రోత్సహిస్తున్నారు.

శ్రీ అంబికాపతి మరొక పథకం కూడా అమలు చేస్తున్నారు. తంజావూరు నగరంలో హిందూ ప్రముఖులు నివసించే వీధులలో ఇండ్లను

స్థలాలను కొనుగోలు చేయటం, హిందూ యువకులను పెద్ద యెత్తున ధనాశ చూపి ఇస్లాంలోకి మార్చటం వారి పథకంలోని భాగాలు. తంజా వూరులో చిరకాలంగా ఉన్న "మహాదానవీధి" అనే పేరును "మదీనా వీధి"గా మార్చిన ఘనత వారిదే. ఈ జిల్లా తమిళనాడుకు ధాన్యాగారం. ఇక్కడ కమ్యూనిస్టుల కార్యకలాపాలు కూడ విస్తారంగా ఉన్నాయి. వారు హరిజనులను కుటిలంగా ఉపయోగించుకుంటున్నారు. కమ్యూ నిస్టుల కబంధ హస్తాలనుండి బయటపడాలనీ, ఒక బలమైన సంస్థ ఏదైనా తమను ఆదుకోవాలని ఇక్కడి వారు వాంఛిస్తున్నారు.

తమిళనాడు రాష్ట్రంలో హరిజనులను మహమ్మదీయులుగా మార్చే కుతంత్ర కార్యకలాపం ఇంతవరకు నాలుగు జిల్లాలకు విస్తరించింది. అవి రామనాథపురం, మధురై, తంజావూరు, తిరునల్వేలి జిల్లాలు. భారీయెత్తున బహిరంగ ఉత్సవం జరపటంతో మధురై (కురయూరు); తిరునల్వేలి (మీనాక్షిపురం) జిల్లాలవార్తలుమాత్రమే వెలుగులోకివచ్చాయి. కానీ తంజా వూరు జిల్లాలో మతం మార్పిడులు గుట్టుచప్పుడు కాకుండా సాగుతున్నాయి. మిగతా జిల్లాల కంటే ఇక్కడి ముస్లింలు మంచి ఆర్థికస్థితి కల్గినవారు.

మే నెలాఖరు నాటికి ఈ నాలుగు జిల్లాలలో కలిసి మొత్తం 1425 మంది మాత్రమే మతం మార్పిడి చెందారు. తిరునల్వేలిజిల్లాలో 957 మంది, మధురైలో 265 మంది, రామనాథపురంలో 158 మంది, తంజావూరులో 45 మంది మాత్రమే నేటికి మతం మార్చుకున్నారు. కానైతే ఒక్క తంజావూరు జిల్లాలోనే 500 గ్రామాలలో ఒకలక్షమందిని మతం మార్పించాలని ప్రణాళికలు సిద్ధమై ఉన్నాయి. రామనాథపురం పరిసర గ్రామాలలో ఆగస్టులో జరుపదలుచుకున్న మతం మార్పిడులు జూలై 29నే జరిపించారు. ఎందుకంటే, ఆ రోజున అక్కడ హిందూ సమైక్యతా సమితి వారి సభలు జరిగినై.

ఈ విధంగా పెద్దపెట్టున ప్రణాళికలు వేసి జరిపించబడుతున్నట్టివి మతం మార్పిడులు.



# అంతర్జాతీయ కుట్ర

ఈ మతాంతరీకరణల యత్నాలు అకస్మాత్తుగా ప్రారంభమైనవి కావు. భారత్ పై అంతర్జాతీయ ఇస్లాం ముఠా జరిపే కుట్రలో ఇస్లాం మతాంతరీకరణ ఒక భాగం మాత్రమే. మన దేశంలో ముస్లిం జన సంఖ్యను పెంచటం ద్వారా రాజకీయాధిక్యత సాధించటం, తుదకు ఇస్లాం మయంగా మార్చటం వారి ధ్యేయం. "అరబ్ దేశాల ఇస్లామిక్ సంస్థలు భారత్‌లోని పేద హరిజనులను ముస్లింలుగా మార్చాలని నిర్ణయించాయి. లండన్‌లోని అంతర్జాతీయ ఇస్లామ్ సాంస్కృతిక సంస్థ 8 కోట్ల హరిజనులను ముస్లింలుగా చేయాలని తీర్మానించి కార్యక్రమాన్ని నడుపుతుంది." ఈ వార్తను 19 జనవరి, 1981 న కువాయిట్‌లోని 'అరబ్ టైమ్స్' పత్రిక ప్రకటించింది. తక్షణమే యీ విషయాన్ని ఢిల్లీలోని జమాయత్-ఏ-ఇస్లామి వారి "రేడియన్స్" పత్రిక ప్రముఖంగా ప్రకటించింది. (టైమ్స్ ఆప్ ఇండియా — ఢిల్లీ మార్చి 21, 1981).

ఇటీవల హైదరాబాద్‌లో జరిగిన జమాయతే-ఏ-ఇస్లామీ సమావేశాలలో బహిరంగంగానే రాబోయే 10 సం॥ల కాలంలో భారత్‌ను ఇస్లాంమయంగా మార్చాలని ప్రకటించారు మీనాక్షిపురం మొదలైనచోట్ల జరిగిన మతాంతరీకరణలు యాదృచ్ఛికాలు కాజాలవు. ఫిబ్రవరి 19న ఇక్కడ జరిగిన మతాంతరీకరణ ఉత్సవం, హైదరాబాదు సదస్సు ఒకేసారి జరిగేటట్లు చూడబడినై. కేవలం సాంఘిక - ఆర్థిక

అసమానతలు మాత్రమే హరిజనులను హిందూ సమాజం నుండి దూరం చేస్తున్నాయని కొందరు రాజకీయనాయకులు [శ్రీ యోగేంద్ర మక్వానా వగైరాలు] చేస్తున్న ప్రకటనలు పూర్ణసత్యాలు కాజాలవు.

## రాజకీయ ప్రయోజనాలు

మీనాక్షీపురం వగైరా మతాంతరీకరణలు కేవలం మతం పరకే పరిమితమైనవి కూడా కావు. ఇందులో రాజకీయ అధికార వాంఛ ఇమిడి ఉంది. దేశాన్ని మూడు ముక్కలు చేసిన ముస్లింలీగ్ హస్తం కూడ ఇందులో ఉంది. లీగ్ పార్లమెంటు సభ్యుడు శ్రీ అబ్దుల్ సమద్ మీనాక్షీపురంలో కాళిఅమ్మ దేవాలయ భూమికి చెందిన స్థలంలో మసీదుకు పునాది రాయి వేశారు. మరొక ముస్లింలీగ్ శాసన సభ్యుడు శ్రీ షాహుల్ హమీద్ ఈ కార్యక్రమానికి అధ్యక్షత వహించారు, కాబట్టి సాటి హిందువులు కొందరు హింసించటం వల్లను, సాంఘిక అసమానతల కారణంగాను హరిజనులు విసిగి ఒక్కసారిగా ఇస్లాంలోకి చేరిపోయారని వాదించటం కేవలం అజ్ఞానం మాత్రమే. ఇవే కారణమైతే, దేశవ్యాప్తంగా ఇట్టి మతాంతరీకరణలు ఉవ్వెత్తున జరగాలి కదా !

## దక్షిణాదిపైనే ప్రత్యేక దృష్టి ఎందుకు ?

మన దేశంలో మహమ్మదీయుల దండయాత్ర ఉత్తర ప్రాంతంతో ఆరంభమైంది. అక్కడి హిందువులు కొన్ని వందల సంవత్సరాలపాటు మహమ్మదీయ పరివారాల కిరాతకాలకు బలియైనారు. వారి క్రూరవిధానాలను శాయశక్తులా ప్రతిఘటించారు కూడా. ఇప్పుడు మతాంతరీకరణలు ఉత్తరాదిలో ప్రారంభిస్తే హిందువుల నుండి తీవ్ర ప్రతిఘటన ఎదుర్కొనవలసివస్తుందని అరబ్ నుతాకు బాగా తెలుసు. శ్రీ నిహాల్‌సింగ్ "ఇండియన్ ఎక్స్‌ప్రెస్" లో ఈ విషయాన్ని వివరిస్తూ ఒక వ్యాసం కూడా వ్రాశారు.

దక్షిణాది విషయం వేరు. ముఖ్యంగా తమిళనాడు ప్రాంతంలో ఆర్య-ద్రావిడ భేదంతోను, కాలప్రాతిపాదిక మీదను, హిందువులు అనైక్యంగా ఉన్నారు. ఈ విషయం అ తర్జాతీయ ఇస్లాం సాంస్కృతిక సంస్థ రహస్యమైన సర్వేద్వారా గ్రహించింది. తమిళనాడు ముస్లింలు మిగతా వారిలాగా ఉర్దూకాక తమిళం మాట్లాడుతారు. హిందువులతో తేలికగా కలిసి మెలిసి తిరుగుతారు. అందువల్ల ఇక్కడ ముస్లిం వ్యతిరేకత తక్కువ. ఎక్కడ తక్కువ ప్రతిఘటన ఉంటుందో అక్కడనుండే తమ కార్యక్రమాన్ని ప్రారంభించటం ముస్లింల ఆశయం. అందుకే తమిళనాడు ప్రాంతంలో ప్రయోగాత్మకంగా తమకార్యాన్ని జరుపుతున్నారు దేశంలో 8 నుండి 20 కోట్ల వరకు మహమ్మదీయుల సంఖ్యను పెంచటం వారిలక్ష్యం.

## మతం మార్పిడులలో స్వదేశీ–విదేశీ ధనం

ఆర్. యస్. యస్ అధ్యయనబృందం ఈ మతం మార్పిడులకు గల్ఫ్‌దేశాల ధనం ఎట్లా వస్తున్నది వివరాలు సేకరించి, ప్రకటించారు. తిరునల్వేలి జిల్లాలోని కీలకరై గ్రామం స్మగ్లింగ్ కేంద్రం. ఇక్కడి దొంగరవాణా వ్యాపారం కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాలకు కూడ సువిదితమే. కీలకారై ముస్లింలకు గల్ఫ్ దేశాల వారితో సన్నిహిత సంబంధాలున్నాయి. శ్రీలంక–సింగపూర్‌ల ద్వారా వారికి అక్రమంగా అరబ్బుల ధనం అందుతుంది. మద్రాసు నగరంలోని కొన్ని వ్యాపారసంస్థలుకూడ ఈ అక్రమ లావాదేవీలలో ఉన్నాయి. భారీయెత్తున జరుగుతున్న ఈ ఇస్లాం మతం మార్పిడులలో విదేశీ ధనం ప్రముఖస్థానం వహిస్తున్నది. నిజానికి కీలకారై ముస్లింలే అట్టియుట్టి కార్యక్రమాన్ని సమధికోత్సాహంతో నిర్వహించారు.

పెట్రోలు దేశాలనుండి భారత్‌లోని ముస్లింలకు వ్యక్తిగతంగాను ముస్లింసంస్థలకు సామూహికంగాను అందే ధనం ఇటీవలి కాలంలో విప

రీతంగా పెరిగింది. ఆ డబ్బు ముఖ్యంగా మతాంతరీకరణలు జరిగే జిల్లాలలో ఖర్చు పెట్టబడుతున్నది. ఇందుకు నిదర్శనం— ఒకే ముస్లిం వ్యక్తిచేత నడుపబడుచున్న "సద్గుణ వైద్యశాలై" అనే సంస్థకు లిబియా నుండి రు. 1. 25 కోట్ల ధనం పంపించబడటం! ఒక వ్యవసాయ సహాయ కార్యక్రమం పేర 4 లక్షల రూపాయలు అందజేసి యాభై మంది హరిజనులను ముస్లింలుగా మార్చినట్లు లండన్‌లోని ఇస్లామిక్ సాంస్కృతిక సంస్థ ప్రకటించింది. ఇవిగాక 1980 ఆగస్టులో జరిగిన మొరాదాబాద్ కల్లోలాలలో అరబ్ దేశాల వారి ధన ప్రవాహాన్ని గమనింపవచ్చును. అక్కడ ముస్లిం విశ్వవిద్యాలయాల స్థాపన పేరుతో కోట్లకొద్దీ ధనం అందజేయబడింది.*

మీనాక్షిపురంలో



విదేశీ దుస్తుల్లో వెలిగిపోతున్న
'మాజీ' హరిజన యువకుడు



మతం మార్పిడులు జరిగిన మీనాక్షిపురం- అట్టియుట్టు గ్రామాలలోని హరిజనులు అంతకు పూర్వం నిత్యం పనిచేసి జీవించేవారు. ఇస్లాంలో చేరిన తర్వాత వ్యవసాయపు పనులకు వెళ్ళటం పూర్తిగా మాని

* నవభారతి ప్రచురణలు— 'మొరాదాబాద్ కల్లోలాలు' చదవండి.

వేశారు. ప్రస్తుతం వారు తమ ఆర్థికస్థాయిని మించిన విలాసజీవితం గడుపుతున్నారు. హరిజనులపై మిగతాకులాల అణచివేతల వలన ఈ మతం మార్పిడి జరిగిందని చెప్పటం సాకు మాత్రమే. అసలు కారణం సులభంగా లభిస్తున్న ధనమే.

## ఇస్లాంలో సమానత్వమా!

ఇస్లాంలో వర్ణవ్యవస్థలేదని, ఆర్థికపరంగా-సామాజికంగా ఏ విభేదం పాటింపబడదని వారు చెప్పుకుంటారు. ఆచరణలో ఇది సత్యమేనా?

తంజావూరుజిల్లా ముత్తుపెట్టైకి చెందిన శ్రీ రాజగోపాలన్ అనే హరిజనుడు ఇస్లాం స్వీకరించిన వారిలో ఒకరు. మతాంతరీకరణలు జరిగిన కొద్దిరోజుల తరువాత ఆయన భార్య నీటికొరకై చెరువుకు వెళ్ళింది. ఆ సమయంలో చెరువు గట్టునే ఉన్న ముస్లిం స్త్రీలు ఈమెను చూచి, "మాజీ" హరిజన స్త్రీ-(అస్పృశ్యురాలు) అని స్నానం చేయటం మానివేసి, తాము అస్పృశ్యులతో పాటు స్నానం చేయమని స్పష్టంగా చెప్పి వెళ్ళిపోయారు. ఈ సంఘటన అనంతరం శ్రీ రాజగోపాలన్ హతాశులై, తిరిగి హిందువుగా మారిపోయారు. ఈవిషయాన్ని శ్రీరాజగోపాలన్ స్వయంగా వెల్లడించారు.

మీనాక్షిపురం మొదలైనచోట్ల ఇస్లాం స్వీకరించిన హరిజనులలో క్రొత్తమోజు క్రమంగా తగ్గిపోతున్నది. నిజానికి కొందరు పశ్చాత్తాపం వెల్లడిస్తున్నారు. అక్కడ ప్రతి శుక్రవారం మసీదుకు వెళ్ళేవారి సంఖ్య కూడ క్రమంగా దిగజారింది. కష్టపడకుండా తమకు లభించిన డబ్బు సోమరితనాన్ని తెచ్చిందని గ్రహిస్తున్నారు. వారిలో కొందరు స్మగ్లింగ్‌కు పూనుకొనే సూచనలున్నాయి. మరికొందరు నిజమైన ఆవేదనతో తిరిగి హిందువులుగానే జీవించాలని నిశ్చయించుకొంటున్నారు. ఇస్లాంలో సమానత్వం పాటింపబడదని, అందులోనూ అనేక తెగలు — వైషమ్యాలు

ఉన్నపనేదికూడ బహిరంగ విషయమే. షియా, సున్నీ, బహాయి మొదలైనతెగలవారు వివిధ దేశాలలో పరస్పరం దారుణమైన హింసా కాండకు దిగటం మనకుసువిదితమే. భారతదేశంలోని లక్నోనగరంలో షియా-సున్నీ పోరాటాలలో అనేకమంది హతులైనారు. అవి ఇప్పటికీ కొనసాగుతూనే ఉన్నాయి. [అనుబంధం 1 చూడండి]

## జమాయత్-ఏ ఇస్లామీ ప్రచారం

జమాయత్—ఏ-ఇస్లామీ వారి ఒక పత్రిక మీనాక్షిపురంలో హరి జనులు సవర్ణ హిందువులైన తేవర్లచే వెలివేయబడ్డారనీ, ఆ కారణంగా 1200 మంది హరిజనులు ఇస్లాం స్వీకరించారని వ్రాసింది.

అసలు మీనాక్షిపురం గ్రామజనాభా 1200 మాత్రమే. ఇందులో అధిక సంఖ్యాకులు హరిజనులు. వారిలో మహమ్మదీయులుగా మారిన వారి సంఖ్య 745. ఆ గ్రామంలో అంటరానితనం పాటించరు. తేవర్ కులం వారికి, హరిజనులకు కులభేదం వలన వచ్చే తగాదాలు కూడ ఆ గ్రామంలో లేవు. అదేవారి ప్రత్యేకత. సుమారు అయిదు ఏండ్ల క్రిందట తంగరాజు అనే హరిజన యువకుడు ఒక తేవర్ స్త్రీని ఎత్తుకు పోయి పెళ్ళిచేసుకున్నాడు. తేవర్ కులం వారిలో ఒక సంప్రదాయం ఉన్నది. మామకూతురు లేదా అత్తకూతురును వారి బావలకు పెళ్ళి చేసితీరాలి. ఒకవేళ ఆ యువకుడు వద్దంటే తప్ప వేరొకరికిచ్చి పెండ్లి చేయకూడదు. ఇలాంటి విషయంలో హద్దుమీరితే హత్యలు కూడ జరుగుతవి. అదివారి పట్టుదల. అలాంటి వరుసైన పెండ్లి కొడుకుని తమిళంలో "మురై మాప్పిళ్లై" అంటారు. తంగరాజ్ తీసికొని వెళ్ళిన స్త్రీకి గూడ "మురై మాప్పిళ్లై" ఉన్నాడు. అతడు తంగ రాజుతో తగాదాకు వచ్చినప్పుడు తంగరాజ్ అతని కాలుకుంటివాణ్ణి చేశాడు. ఈ సంఘటన తరువాత తేవర్లంతా తనను చంపేస్తారని

భయంతో తంగరాజ్ ముస్లింగా మారి "యూసఫ్" అయ్యాడు అటు తరువాత తన దగ్గరి బంధువుల్ని ముస్లింలుగా మార్చాడు.

ఇక ఇటీవల జరిగిన తేవర్ల హత్య కేసులో పోలీసులు హరిజను లను హింసించటం మొదలు పెట్టారు. ఇట్టి దుస్థితిలో హరిజనులు ముస్లింల మతాంతరీకరణల ముఠాచేత చిక్కారు. ఎటువంటి క్రూర కృత్యం చేసినా ముస్లింలమీద ప్రభుత్వము, పోలీస్ యంత్రాంగం ఏ చర్యా తీసికోవటానికి భయపడుతుంది—అనే నమ్మకం వారికి ఉంది. ఇదిగాక అరబ్ధనం నీళ్ళలాగా ప్రవహిస్తున్నది విద్యావంతులైన— విద్యావిహీనులైన హరిజనులలోని అసంతృప్తిని సాధనంగా చేసుకొని ఇస్లాం కల్చరల్ సొసైటీ అనే సంస్థ అరబ్ ధనంతో ఈ మతాంతరీకరణలను జరిపించింది. అంతేగాని మీనాక్షిపురంలో హరి జనులను ఎవ్వరూ వెలివేయలేదు. చాల తక్కువ సంఖ్యలో ఉన్న తేవర్లకు హరిజనులను వెలివేయటం ఎలా సాధ్యం? పత్రికలు సత్యాన్ని తారుమారు చేసే ప్రయత్నాలు చేయటం—మరికొందరు పెద్దలు వంత పలకటం లజ్జాకరమైన విషయం.

## అస్పృశ్యత-హిందూ సమాజం.

మతాంతరీకరణలకు కేవలం ఇస్లాం దేశాల కుట్రే కారణం అనుకోరాదు. హిందూ సమాజంలోని లోటుపాట్లు కూడ ఇందుకు ఒక కారణమే. అంటరానితనం అనేది హిందూ సమాజానికి తీరని కళంకం. చాలకాలం నుండి హిందువులు దీనిని పాటించటం వలన హరిజన సోదరులలో నిరాశా—నిస్పృహలు అలము కోవటం జరిగింది. వాస్తవానికి అంటరానితనం శాస్త్ర విరుద్ధం, అసాంఘికం గూడా. తర తరాలుగా తమలోని కొందరు హిందువులను దూరంగా ఉంచటంవల్ల ఎంతహాని జరుగుతున్నదో హిందువులందరు ఇప్పటికైనా గుర్తించాలి.

ఈ దురాచారాన్ని రూపుమాపటానికి అనేకమంది సంఘ సంస్కర్తలు, మతాధిపతులు కృషి చేస్తూనే ఉన్నారు,

ఈ విషయాన్ని మీనాక్షిపురంలో జరిగిన "హిందూ ఐక్య సంఘటన" సభలలో ఆయా మతాలకు చెందిన ప్రముఖులు విస్పష్టంగా ప్రకటించారు. "వేదాలలోను, శాస్త్ర గ్రంథాలలోను అస్పృశ్యతను పాటించాలని ఎక్కడా పేర్కొన లేదు; పైగా సమాజంలో సోదర భావాన్ని, స్నేహాన్ని పెంపొందించాలనే సందేశం ఇవ్వబడింది. అంటరానితనం-భేదభావాలు కృత్రిమమైనవే కాని హిందూ ధర్మాలు ఎంత మాత్రము కావు-అట్టివి పాటించటం ధర్మ విరుద్ధం"—పూజ్య పెజావరు స్వామీజి, మధురై మతాధిపతి శ్రీ దేశికర్, శ్రీ స్వామి అంబికాన్గరసు, శ్రీ రామదాసర్ పై ప్రకటన చేసిన వారిలో ఉన్నారు. పైవారి కుట్రలు, మనలోని లోపాలు రెంటినీ ఏకముఖంగా ఎదుర్కొన వలసిన అవసరం నేడు హిందూ సమాజానిది.



హిందూ సమాజాన్ని సంస్కరించి,
సమైక్యంగా నిలపటానికై కృషి
చేస్తున్న పూజ్య పెజావరుస్వామిజీ



# మతం మార్పిడులు తెచ్చే ముప్పు

ఒక్క మాటలో చెప్పాలంటే జాతీయతకు-దేశ ఐక్యతకు మతాంతరీకరణలు ఒక గొడ్డలిపెట్టు. మన గత చరిత్ర-నడుస్తున్న చరిత్రలే ఇందుకు సాక్ష్యాలు.

ఇవి ఆధ్యాత్మిక ఔన్నత్యాన్నిగాని, ఆరాధనా పద్ధతిని గాని ఉద్దేశించి, సంపూర్ణ విశ్వాసంతో స్వచ్ఛందంగా జరిగిన మతాంతరీకరణలు ఎంతమాత్రం కావు భారత చరిత్రలో గతంలో జరిగిన మతాంతరీకరణలు భారతీయ జీవనాన్ని ఛిన్నాభిన్నం చేసి, భౌగోళికతకు కూడ తీరని ముప్పును కలిగించాయి. ఈ దేశంలోని ముస్లింలు, క్రైస్తవులలో 90 శాతం మంది మతాంతరీకరణవలన ఏర్పడినవారే. ఈ విషయాన్ని శ్రీ సయ్యద్ షహబుద్దీన్ (ఎం. పి) కూడ అంగీకరించారు. ఒకనాటి గాంధార ప్రాంతం (ఇప్పుడు ఆఫ్ఘనిస్తాన్) నేడు దూరమైంది. పంజాబ్, సింధ్, బెంగాల్ ప్రాంతాలు వేరుపడ్డాయి. పాకిస్తాన్ పుట్టుకకు అసలు ఈ మతాంతరీకరణలే కారణం.

ఈనాడు క్రైస్తవ మిషనరీల మతాంతరీకరణల మూలంగా నాగాలాండ్, మేఘాలయ, మిజోరాం వంటి ప్రాంతాలలో వేర్పాటువాదం బలంగా ఏర్పడిఉంది. ఆ ప్రాంతాలు కేవలం భారత భూమితో ఇప్పుడు అంతర్భాగాలుగా ఉన్నా ప్రధాన జాతీయ జీవనం నుండి అక్కడి వారు ఎప్పుడో క్రైస్తవం పేర దూరం చేయబడ్డారు. కేంద్ర మంత్రి శ్రీ ఘనీఖాన్ చౌధురి ఇట్టి బలవంతపు మార్పిడులు ముస్లింలకే ఎక్కువ హాని చేయగలవని, వీటిని నిలుపు చేయమని ప్రధానికి విజ్ఞప్తి చేశారు. పాకిస్తాన్ సృష్టివల్ల అంతులేని హాని జరిగిందని వీరు అంగీకరిస్తారు.

**మీనాక్షిపురంలో**



పైన దేవతలు
క్రింద నమాజులు

ఈ మతాంతరీకరణలు జాతీయ ఐక్యతకే అత్యంత ప్రమాదకరమైనవిగా ప్రతి భారతీయుడు గ్రహించాలి. అన్యమత స్వీకారంతో ఆ వ్యక్తిలో భారతీయతపట్ల వ్యతిరేకత ప్రబలుతున్నది. ఫలితంగా హిందూ–ముస్లిం (క్రైస్తవ) ద్వేషాలు సంఘర్షణలు పెరిగిపోతున్నాయి.

మతాంతరీకరణ చెందిన కుటుంబాలలో కొందరు వ్యక్తులు హిందువులుగానే ఉండిపోయారు. శ్రీ ఎస్. పెండారామ్ హరిజనులు. వ్యవసాయదారులు. ఆయన బంధువులు ఇస్లాంలో చేరారు. ఆయన

హిందువుగానే ఉన్నారు. బయటి నుండి అనేకులైన హిందువులు వచ్చి తమ యోగక్షేమం విచారిస్తున్నందుకు–ఆదుకున్నందుకు ఆయన సంతోషం వ్యక్తపరిచారు. కాని ఆయా కుటుంబాలలో ఈ ఇస్లాం మతాంతరీకరణలవల్ల వైషమ్యాలు కలుగుతున్నాయి. ఒక హరిజన కుటుంబంలోని యువకుడు యూసఫ్‌గా మారాడు, కాని అతని ముగ్గురు సోదరీమణులు-సోదరులు మాత్రం హిందువులుగానే ఉన్నారు.

## త్వరలో ఇస్లాం కౌగిలిలోకి........?

ఇస్లాం మతా వ్యూహంలో చిక్కుకో బోతున్న మరికొన్ని గ్రామాల వార్తలు వెలుగులోకి వస్తున్నాయి. రామనాథపురం జిల్లా ముదుకులత్తూర్ తాలూకాకు చెందిన పెరయూర్ గ్రామంలోని 120 హరి జన కుటుంబాలు ఇస్లాంలోకి మార్చబడటానికి సిద్ధమవుతున్నాయి. అదే విధంగా కురయూర్‌లోని మిగిలిన హరిజన కుటుంబాలను, పుదుకూలం, వీరచోళం, కాంచని, వల్లం, పల్లవలాశై గ్రామాలలోని కొన్ని హరిజన కుటుంబాలను కూడ మార్చే ప్రయత్నాలు జరుగుతున్నాయి.

"వ్యవసాయిగల్ మున్నేట్ర సంఘం"— అనే సరికొత్త వ్యవ సాయ కార్మిక సంఘాన్ని స్థాపించి క్రొత్తగా ఇస్లాంలో చేరిన హరిజను లను కలిపి ఉంచే ప్రయత్నాలు ప్రారంభించారు. ముదుకులత్తూర్‌కు చెందిన ముస్లిం ప్రముఖుడు అబ్బాస్ అహమ్మద్ దీనికి అధ్యక్షుడు. మరొక ప్రముఖుడు అమీర్ పాషా దీనికి సంఘటనా కార్యదర్శి.

ఈ మతం మార్పిడి కార్యకలాపాలు కేంద్రపాలిత ప్రాంతమైన పాండిచేరికి కూడా ప్రాకాయి. పాండిచేరికి సమీపంలోని తిమ్మనైకెం పాలెం గ్రామానికి చెందిన 1500 మంది హరిజనులు ఇస్లాంలోకి మార దల్చుకున్నారని వారి నాయకుడు శ్రీ సి. కృష్ణమూర్తి తెలియ జేసారు. దీనికి కారణం భూస్వాముల దోపిడీ అని, సమాజంలోని వేధింపు చర్య

లని ఆయన తెలియజేశారు. ఇస్లాంలో చేరితే తమకు రక్షణ లభిస్తుందని, తమ హోదా పెరుగుతుందని ఆయన అభిప్రాయ పడుతున్నారు. కాని పాండిచేరి ముఖ్యమంత్రి, ఆయన మంత్రివర్గ సహచరులు మాత్రం హరిజనులు ఇస్లాంలోకి మారటంలో రాజకీయ దురుద్దేశాలు ఉన్నట్లు అనుమానం వ్యక్తం చేశారు.

హరిజనులలో ఉన్న అసంతృప్తిని, హిందువులలోని లోపాలను ఇస్లాం ముతా బాగా ఉపయోగించుకుంటున్నది. అంటరానితనం-అసమానతలను తమ కనుకూలంగా మార్చుకొని హరిజనులను రెచ్చగొట్టిస్తున్నారు. అనేక గ్రామాలలో హిందువులకు హెచ్చరికల పేషతో మహాపత్రాలు (వాల్ పోస్టర్లు) అంటింపజేశారు. "ఫలానా గడువు లోపల అస్పృశ్యతను విడనాడి మమ్మల్ని సమానంగా చూడకపోతే మేమంతా ఇస్లాంలో చేరిపోతాం—" అని హరిజనులు ప్రకటించినట్లుగా అందులో వ్రాయబడి ఉంది.

## మతస్వేచ్ఛను కాపాడాలి:

మహాత్మాగాంధీ అనేక సందర్భాలలో మతం మార్పిడులపై తమ అభిప్రాయాలను స్పష్టంగా ప్రకటించారు. క్రైస్తవ మిషనరీలు— వారి కార్యకలాపాలను తీవ్రంగా నిరసిస్తూ అనేకసార్లు హరిజన్, యంగ్ ఇండియా పత్రికలలో వ్యాసాలు వ్రాశారు. క్రైస్తవ- ముస్లిం మతాంతరీకరణలు అధికాధికంగా వ్యక్తిగత లేదా సామూహిక ప్రలోభాలవల్ల జరుగుతవని వారికి స్పష్టంగా తెలుసు. "నాకే అధికారం ఉండి చట్టం చేయగలిగితే తప్పకుండా మతం మార్పిడిలను నిషేధిస్తాను. మిషనరీల కార్యకలాపాలవల్ల హిందువుల కుటుంబ వ్యవస్థ, వేషభాషలు, ఆచార వ్యవహారాలు ఛిన్నాభిన్నం అవుతున్నాయి"— అన్నారు గాంధీజీ.

( హరిజన్ పత్రిక— జూన్ 12, 1937 )

తన కుమారులలో ఒకరు ఇస్లాంలోకి మారినప్పుడు గాంధీజీ తీవ్రమైన వ్యథను పొందారు. "ఒకవేళ అతడు పవిత్ర హృదయంతో ఇస్లాంలోకి పరివర్తన చెంది ఉంటే నాకేమి వ్యతిరేకత లేదు. కాని అతన్ని మహమ్మదీయునిగా మార్చిన వ్యక్తులు అతనిలోని బలహీనతలను రెచ్చగొట్టి మార్పించారు. వాళ్ళు నిజమైన ముస్లింలు కారు. నాగుండెలలో పొంగే రక్తంలో కలాన్ని ముంచి ఈ విషయాలనే వారికి ఉత్తరంలో వ్రాశాను."— (హరిజన్ – జూన్ 27, 1936)

భారత రాజ్యాంగ నిర్మాత- ప్రముఖ హరిజన నాయకులైన శ్రీ బి. ఆర్. అంబేద్కర్ కూడ ఇస్లాంలోకి- క్రైస్తవంలోకి మారటానికి అంగీకరించలేదు. తాము అన్యమత స్వీకారం చేయదల్చలేదని ప్రకటిస్తూ భారతదేశంలో పరిఢవిల్లిన బౌద్ధమతాన్ని అవలంబించారు. ఇక స్వాతంత్ర్యానంతరం మన ప్రభుత్వపు విధానాలవల్ల క్రైస్తవ మిషనరీల స్లాం సంస్థల కుతంత్రాలు బాగా తీవ్రస్థాయికి చేరుకున్నాయి. జాతి ానికి ఎంతో మూల్యాన్ని చెల్లిస్తూనే ఉంది. వీటిని 1956వ సంవత్స ంలో నియోగి కమిటీ బహిరంగపరచింది. మధ్యభారత్‌లోని ఈషంగా బాద్ జిల్లాలో "జైహింద్"కు బదులుగా "జై ఏసు" నినాదాన్ని అల వాటు చేయాలని వారు ప్రయత్నించారు. "జైహింద్ నినాదంతమను వమానించటానికి ఉద్దేశించిందని క్రైస్తవ మిషనరీల వాదం" — అని రిపోర్టు పేర్కొన్నది.

968 వ సంవత్సరంలో మధ్యప్రదేశ్ – ఒరిస్సా ప్రభుత్వాలు చ్ఛచట్టాన్ని (**Freedom of Religion Act**) ప్రవేశ పెట్టాయి. చట్టం రాజ్యాంగ విరుద్ధమని క్రైస్తవ మిషనరీలు హైకోర్టులో సవాల్ యగా, వారివాదనను కోర్టు త్రోసిపుచ్చింది. ఆ తరువాత వారు సుప్రీం కోర్టుకు కూడా వెళ్ళారు. వారితీర్పులోకూడ హైకోర్టునే సమర్థించటం జరిగింది. ఆ తీర్పులో గాంధీజీ అభిప్రాయాలు ప్రతిబింబించాయి.

రాజ్యంగంలోని "ప్రచారం చేసుకొనే" హక్కును మతాంతరీకరణ చేసుకొనే హక్కుగా మిషనరీలు వాదించారు. అదివాస్తవంకాదని ప్రధాన న్యాయమూర్తి శ్రీ ఎ. ఎన్.రే తీర్పునిచ్చారు రాజ్యాంగంలోని ఆర్టికల్ 25(1) క్రింద ఒకవ్యక్తి తనమత భావాలను ప్రచారం చేసుకొనే స్వేచ్ఛ కలిగి ఉండటం నిశ్చయమే. కాని దానిననుసరించి ఒకవ్యక్తిని తన స్వీయమతంనుండి వేరొకమతంలోకి మార్చటం దాని ఉద్దేశ్యంకాదు*

1978 లో అరుణాచల ప్రదేశ్ ప్రభుత్వం మత స్వేచ్ఛ బిల్లు ప్రవేశపెట్టింది. వెంటనే మరల క్రైస్తవమిషనరీలు కాకిగోల ప్రారంభించారు. కాని అది ఆ ప్రాంత శాసనసభలో నెగ్గి భారత రాష్ట్రపతి ఆమోద ముద్రకూడ పొందింది. ఆతరువాత అలాంటి బిల్లునే లోక్‌సభలో శ్రీ ఓం ప్రకాశ్‌త్యాగి ప్రవేశపెట్టారు. ఒకవ్యక్తిని రెచ్చగొట్టి లేదా ప్రలోభపెట్టి, ధనాశచేగాని భయపెట్టిగాని మతం మార్చటాన్ని ఆ తీర్మానం తీవ్రంగా వ్యతరేకిస్తున్నది. కాని క్రైస్తవ మిషనరీలు, ముస్లిం సంస్థలు, వారిఓట్లకోసం కక్కుర్తి పడుతూ దేశాన్ని తాకట్టుపెట్టటానికి కూడ సిద్ధపడే రాజకీయనాయకులు కొందరు ఆ తీర్మానాన్ని తీవ్రంగా ప్రతిఘటించారు

ఫలితం—నేడు ఎన్నో మీనాక్షిపురాలు – రహ్మత్ నగర్‌లుగా మార్చబడుతున్నాయి. ఇప్పటికైనా రాజకీయనాయకులు కండ్లు తెరచి తమపదవులకంటె దేశక్షేమంమిన్నయని గుర్తించి దేశమంతటా వర్తించే విధంగాపార్లమెంటులో మత స్వేచ్ఛచట్టం(**Freedom of Religion Act.**) ప్రవేశపెట్టాలి.

హిందూ ధార్మిక సంస్థలు—స్వచ్ఛంద సేవాసంఘాలు ఈ దిశగా ప్రభుత్వంపై ఒత్తిడి తీసుకురావాలి. ఇదే తక్షణ కర్తవ్యం.

---

* చదవండి-నవభారతి ప్రచురణ - "మతం మార్పిడి రాజకీయాలు"

# 5 హిందూ సమాజంలో జాగృతి

మఠాధిపతులు అస్పృశ్యత హిందు ధర్మశాస్త్ర విరుద్ధమని ఏనాడో ప్రకటించారు. ఉడిపి-పెజావరు మఠాధిపతి శ్రీ విశ్వేశ్వర తీర్థ హరిజన వాడలలో సేవా కార్యక్రమాలను ప్రారంభించవలిసినదిగా హిందువులను చాలకాలం క్రితమే ప్రబోధించి వారు ఆచరిస్తున్నారు. అనేక హరిజన వాడలలో ఆలయాల నిర్మాణం-పూజా కార్యక్రమాలను—ఇతర సేవా కార్యాలను వారు స్వయంగా చేయించారు. మధురైస్వామి శ్రీ జిజ్ఞాన సంబంధ దేశికర్, తంజావూరు మఠాధిపతి స్వామి అంబక్కారసులతో కలిసి "హిందూ ఐక్య సంఘటన" ప్రారంభించారు. తమిళనాడులో గ్రామప్రాంతాలలో పర్యటనలు జరిపి హరిజనులకు ధైర్యాన్ని కల్గిస్తున్నారు. హరిజనసోదరులను ఆదుకోవలసినదిగా హిందువులను కోరుతున్నారు. కొందరు హరిజనులు వారి సమక్షంలో హిందూధర్మంలోనికి పునరాగమనం చేశారు. మరికొందరు పునరాగమనానికి సిద్ధపడుతున్నారు. శ్రీ కంచి కామకోటి పీఠాధిపతులుకూడా కార్యక్రమాలకు తమ పూర్తి సంసిద్ధతను ప్రకటించి సహకారాన్ని అందిస్తున్నారు.

ఆయా ప్రాంతాలలోని హిందూ మఠములు ఒక్కొక్క గ్రామాన్ని దత్తత తీసికొని సేవాకార్యాలకు సిద్ధమవుతున్నాయి. అనేక గ్రామాలలో సహపంక్తి భోజనాలు నిర్వహించారు. అధ్యయన బృందాల

పర్యటన. ప్రచారసాహిత్యము, హిందూ ధార్మిక సమ్మేళనాలు, పునరాగమనాలు... ఇందుకొరకే పూర్తి సహాయాన్ని చేకూర్చించే కార్యకర్తల ఏర్పాట్లు మొదలైన వాటి క్రింద రు. 20.60 లక్షలతో ఒక కార్యక్రమాన్ని సిద్ధంచేసి అమలు జరుపుతున్నారు.

## స్వచ్ఛంద సంస్థల కృషి :

మీనాక్షిపురం- అట్టియుట్టు మొదలైన గ్రామాలలో రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్. విశ్వ హిందూ పరిషత్, ఆర్యసమాజ్, రామకృష్ణమిషన్‌వంటిసంస్థలు తక్షణసేవాకార్యక్రమాలుఆరంభించాయి నాలుగు మాసాల క్రిందటే ఆర్. యస్. యస్ ఒక అధ్యయన బృందాన్ని పంపించింది. వారు రామనాధపురం, మధురై. తిరునల్వేలి, తంజావూరు జిల్లాలలో పర్యటించి వాస్తవ సమాచారాన్ని, మూలకారణాలను సేకరించారు. ఈ సమస్య పూర్తిగా అదుపు తప్పిపోయే పరిస్థితిలో లేదు. హిందూ సమాజం ఐక్యమై నిలిస్తే పరిష్కరించటం సులభమే. ఇస్లాం మతా అంత పెద్ద యెత్తున మతాంతరీకరణలు జరిపించినా హరిజన సోదరులలోని సాంస్కృతిక భావాలు హిందూత్వంతోటే ఉన్నాయి. మహాభక్తులు, హరిజనులకు మార్గదర్శకులు అయిన నందనార్ - కన్నప్పన్‌లపై వారికి భక్తిప్రపత్తులు ఉన్నాయి. హరిజనులలో అధిక సంఖ్యాకులు ఇప్పటికీ హిందువులే. పై మహాభక్తులను ఆదర్శంగా కొన్న వారందరిని ఐక్యం చేసి ఈ ఇస్లాం మతా దురాగతాలను అరికట్టవచ్చు. ఆర్. యస్. యస్. మొదలైన సంస్థలు ఈ దిశగా పని ప్రారంభించి కార్యక్రమాలను కొనసాగిస్తున్నారు.

ఈ ప్రమాదాన్ని అందరకు వివరించి హిందువులను హరిజనులను ఒక్క త్రాటిపై నడిపే ప్రయత్నం చేస్తున్నారు. పునరాగమన కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నారు. మీనాక్షిపురంలో మొదటివిడతగా ఒక

50మంది పునరాగమనం చేశారు. మరో 50మంది హరిజన సోదరులు ఇస్లాంను విడిచివేసి పెజావరుస్వామి సమక్షంలో పునరాగమనానికి సిద్ధమవుతున్నారు.

విశ్వహిందూ పరిషత్, ఆర్. యస్. యస్. కార్యకర్తలు ఆయా ప్రాంతాలలోని హిందూ ప్రముఖులను కలిసి వారి సహకారాన్ని పొందారు. తేవర్లు మొదలైనవారు హరిజనుల పట్ల చిన్నచూపును విడనాడి సమభావంతో సహకారాన్ని అందిస్తున్నారు. మరల ఇస్లాం మతాంతరీకరణలు జరుగకుండా హరిజనులు, హరిజనేతరులు కలసి ఒక సంయుక్త సంఘాన్ని ఏర్పాటు చేశారు. బృందాలవారీగా ఆయా గ్రామాలకు పాదయాత్రలు నిర్వహిస్తూ సమాజంలోని అన్నివర్గాలకు రాగల ప్రమాదాన్ని గురించి హెచ్చరిస్తూ సమైక్యంగా పనిచేస్తున్నారు.

పైనతెల్పబడిన అన్నిసంస్థలు, తమిళనాడు దేవాలయ సంరక్షక సంఘం కలసి ఒక "హిందూ సంఘటనా కేంద్ర సంఘా"న్ని స్థాపించారు. వీరందరు కలిసి హరిజనకాలనీలలో ఇంటింటికీ తిరిగి ధైర్యాన్ని కల్గిస్తున్నారు. ఆయావాడలలో సహపంక్తిభోజనాలు ఏర్పాటు చేస్తున్నారు. పై సంఘానికి స్వచ్ఛంద కార్యకర్తలను పెద్ద యెత్తున సమీకరించటం జరుగుతున్నది. కుడ్యపత్రాలు, కరపత్రాలు, ఇతర ప్రచార సాహిత్యము లక్షల సంఖ్యలో ముద్రించి ప్రజలకు అందజేస్తున్నారు. నందనార్ మొదలైన భాగవతోత్తములను గూర్చి గ్రామాలలో చలనచిత్ర ప్రదర్శనలను కూడా నిర్వహిస్తున్నారు.

## స్వామిరామదాస్ సంఘటన

స్వామి శ్రీ రామదాస్ ఒక సన్యాసి. వారు హరిజన కుటుంబానికి చెందినవారు. స్వస్థలం మదుకులత్తూర్ తాలూకాలోని కుదందుర్రై గ్రామము. వారు మలేసియాలో ఒకమఠాన్ని నిర్మించి అక్కడ ధర్మ

ప్రబోధం చేస్తున్నారు. వారు హిందూపురాణాలను క్షుణ్ణంగా అధ్యయనం చేసినవార్లు, తమిళంలో గొప్పవిద్వాంసులు. ప్రపంచ తమిళ మహాసభలకు మధురై విచ్చేసి ఆయాప్రాంతాలు పర్యటిస్తున్నారు. ఆగష్టు '81కి తిరిగి మలేసియా వెళ్ళనున్నారు. జూలై 5, 1981 న స్వామివారికి మదుకలత్తూర్‌లో సన్మానకార్యక్రమం నిర్ణయించారు. అయితే జిల్లాలోని వివిధ ప్రాంతాలకు చెందిన హరిజన నాయకులు పైకార్యక్రమంపేర సమావేశమై ఇస్లాం స్వీకారం విషయమై ఆలోచించాలని ముందుగా నిర్ణయించుకున్నారు. సామాజికంగా తమపై చూపుతున్నన్యూనత - పోలీసుల అత్యాచారాలు వగైరాలను స్వామికి వివరించారు.

ఐక్య హిందూ సంఘటన కార్యకర్తలు స్వామిరామదాస్‌ను కలిసి మూడుగంటలకు పైగా చర్చించి, జరుగుతున్న మతాంతరీకరణలకు వ్యతిరేకంగా స్వామి వారిని సన్నద్ధులను చేశారు, ఆ కార్యకర్తలలో శ్రీ వైద్యలింగం (హరిజనులు) ఒకరు ఇప్పుడు స్వామిరామదాస్, శ్రీ వైద్యలింగంతో కలసి తీవ్రమైన ప్రచారం జరుపుతూ, హరిజనులు మతాంతరీకరణలకు గురికాకుండా కృషిచేస్తున్నారు.

జూలై 15, 1981 మీనాక్షిపురంలో జరిగిన బ్రహ్మాండమైన హిందూ ధార్మిక మహాసభకు పూజ్యశ్రీ పెజావరుస్వామి, తంజావూరు మధురై మఠాధిపతులతో కలసి, స్వామిరామదాస్ పాల్గొన్నారు. తాము హరిజనులను ఎంత మాత్రం మతాంతరులుగా మారిపోనీయమని హిందువులుగానే జీవించేటట్లు చేస్తామని ప్రతిన బూనారు. అనాటి సభలో శ్రీ పెజావరుస్వామి కురయూర్ గ్రామాన్ని తమ మఠం దత్తత తీసికొని సర్వతోముఖాభివృద్ధి చేయగలదని ప్రకటించారు.

జూలై 15, 1981 న ఆర్య సమాజ్ వారు హవనము, శుద్ధి సంస్కారము నిర్వహించారు. 50మంది(ముస్లింలుగా మారిన హరిజనులు) హిందూ ధర్మంహికి తిరిగి వచ్చారు. ఆ పిదప వివిధ మఠాధిపతులు, కార్యకర్తలు, హరిజన సోదరులతో సహపంక్తి భోజనం చేశారు.

